శ్రీ రస్తు

Sl No. 173

Ac. No. 3398



శ్రీపట్టాభిరాములు-

శ్రీరామాయనమః

శ్రీమన్నిఖిలమహీమండలంబుననుండు
సకలసుజనులకు
మనోరంజకంబుగా

# శ్రీరామభక్తకవివర్యునిచే
రచియింపఁబడిన
# శారదరామాయణము.

ఇది
సరస్వతీ, తిరువేంకటాచార్యులవారిచే

స్వకీయమగు.
సరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

అచ్చువేయించి ప్రకటింపఁబడియె
చెన్నపురి.

౧౮౮౦ సం॥ ఏప్రేల్ నెల.

శ్రీరస్తు.

# శ్రీశారదరామాయణము.

## బాలకాండము.

### దరువు -అటతాళము-

ఎంచి॥ విఘ్నేశ్వరునిముందుబూజించి-శారదాంబ వేర్పడబ్రస్తుతించి- సత్కవులనెల్లనుమదినుతించి-రాముడవతరించినయొద్దనుంచి - చెప్పదొణఁగెదనుగుణచర్యలెంచి-రామచంద్రుండుతానుద్భవించి-మునియాగంబుగాచిరక్షించి-సీతపెండ్లాడిమగుడజనుదెంచి- సాకేతపురమునకేగుదెంచి- తండ్రియాజ్ఞయటువేగబాలించి-అడవికేతెంచిదూషణులద్రుంచి-యారావణుండపుడుకోపించిసీతనెత్తుకొనిపోవదుఃఖించి- జనుదెంచియటుసుగ్రీవుఁగాంచి- వాలినొక్కకోలనువేగద్రుంచి- సీతగూడుకొనిమగుడజనుదెంచి-యాయోధ్యపట్టణముబాలించి- ఇట్టికథచాలనేవిస్తరించి-మంచినెరచమత్కారములనెంచి॥ యాశారదాకరుణానిధీ॥ ౧

అంచె॥ దశరథుండుపుత్రులలేమినెంచె-బహుబుధాగ్రజనములవిచారించె- సశ్వమేధయాగంబుగావించెబుత్రకామేష్టియపుడుజేయించె- పరమాన్నమప్పుడుపాత్రనుంచె- తెచ్చిభార్యలకుయిచ్చిమోదించె-గర్భిణీచిహ్నలాదవిక్రమమించె- నెలలుబిండంగనొప్పులరుదెంచె- చైత్రశుద్ధంబులోపలనుమించె- దినమునవమితిథినక్షత్ర,మెం

చె- నుచ్చమైదుకరాటకంబెంచె- శ్రీరామచంద్రుండు ద్భవించె -భరతశత్రుఘ్నలక్ష్మణులుపంచె- మలవిధంబు గానవలజనియించె- దేవతతివిరులవానగురిపించె- నంత ననుకూలవాయువులుమించె- జాతకర్మంబులపుడుజే యించె- నామకరణంబులపుడువ్రాయించె - రామచం ద్రుండనుచునునిర్ణయించె- భరతశత్రుఘ్నలక్ష్మణులు నంచి- తంబుగ బేరులనిడివిభజించె- నారునెలలకన్నం బుముట్టించె- బాలకులుముద్దుమోహంబుమించె ॥ యా శారదాకరుణానిధీ॥ ౨

ఆడు॥ తల్లికొడుకునెత్తుకముద్దులాడు-మోదమలర గననుగన్నవాఁడు-నావెలలేనిమానికమువీఁడు నాకులదీప కుండైనవాడు-నాముద్దులయ్యకుజోడులేడు-నాపురుషసి ష్మాపుపిల్లవీఁడు-నాపంజరపుపైచిలుకవీఁడు-యనుచుకౌస ల్యయిటుముద్దులాడు- చెలికిసతిసేయనీనవ్వువాడు-ఖం గుమనిపాటలిటుఁబాడువాఁడు॥ఓ శారదాకరుణా॥ ౩

బాలా॥సుశీలమోకరుణాలవాలా-జోలబాడెదనుసద్భ క్తలోలా-యూరికెయేందుకేడ్చెదవదేలా- నీకువాకిలి బాపెదరబాలా - యనచుబోధించితూగుటుయ్యలాపై నుంచిఖంగునబాసెజోలా-లోకపాలజోజోముద్దుబాలా, సాధుజనపాలనిద్రబోవేలా-యనుచుకౌసల్యముద్దువేడ్క బాలా-నొంచుచునుబాలుతోనిట్టులీలా॥ఓ శారదా॥ ౪

దంటా॥ బాయలేనురానేనునీవెంట - నాతల్లినోము లుమేటిపంట- పురుషసింహంబుమెడలోనెగంట- ఇంత యెంతైనహద్దులేపంట-ముద్దులాడుకొంచునవ్వుకుంట

ముద్దుగొను వారుమూతిపైనంట జిహ్వాగ్రలికి వెళ్లు వెను
వెంటతియ్యనయ్యున్న మజ్జవ పలకుంట॥ఓ శారదదాక॥ ౪

అం౫॥ ఫాలంబుపై ముద్దుగుల్కంగ - కెంపురావిరేఖ
లాగి జెలగంగ ఆణిముత్యమొక్కటిసమేతంగ - ముక్కున
ను కెంపుకమ్మి వెలుగంగ కుందనపుబద్ది కాయలలరంగ - పె
ద్దపులిగోరులనుసమేతంగ - చంద్రవంకమ్ములరుతనుప్పొం
గ పసిడిసిరికజ్జెలం దెలుచెలంగ. నాట్యమలరఘల్లుమనిమ్రో
యంగ బెరుగుచుండిరీరీతి ప్రాజ్యముగ - నవ్వుచు దశరథుం
డుబ్బి యుప్పొంగ॥ఓ శారదాకరుణానిధీ॥ ౫

అం౬॥ దశరథుండపుడు చాలపోగాదించె - పైదోయే
టనేపంచశిఖలుంచె పట్నమెల్లనప్పుడలంకరించె గొప్ప
గాసంభ్రమంబు జేయించె - సుతులునలుగురికి వడుగుగా
వించె దశరథుండపుడుమదినూహించె గురువునకు వా
రలనునొప్పగించె - సాముచదువులమరంగ జెప్పించె - నుం
డిరీరీతి శోకములనుమించె విశ్వామిత్రుండపుడేగుదెంచె.
నుండిరీరీతి శోకములనుమించె - విశ్వామిత్రుండపుడేగుదెం
చె - వేగదశరథుండెదురేగుదెంచె - తీసుకొనివచ్చి చాలబూ
జించె॥ఓ శారదాకరుణానిధీ॥ ౬

నేను॥ యాగములరంగ దలపెట్టినాను - సరవిసాకల్యం
బుగాను - కానివ్వరే దైత్యులెల్లాను నీయుక్తిగా జుభువిలో
ను - నేడు వివరించి జూడగాను - రామచంద్రవిభునాకి
చ్చితేను - యాగంబు జేసుకొంటాను - అనగదశరథుం
డొగిబలెకెదాను - రామచంద్రవిభునేనియ్యలేను క్షణము
బొడబాసిబ్రతుకంగలేను గద్గదోక్తులనుచుబల్కెగాను -

యనగమునిలేచికోపంబుతోను- వేగమునలేచివెళ్లుచుండ
గను- భయముపుచ్చుకొనిపిలిపించెతాను- రామచంద్రవి
భుబంపించగాను- ధీరుడైయుండెనయోధ్యలోను॥ ఓ
శారదాకరుణానిధీ॥ ౮

దంటా॥ రామలక్ష్మణులకెడలేనిదంట- వెళ్లినారువి
శ్వామిత్రువెంట క్షణములోనెజాగ్రతదప్పకుంట- వారి
లోవారుమాట్లాడుకుంట- మనమీయీవేళవేగమెకంట-
కంటకులయినదైత్యులకుమంట - కలియుదామనివిచారిం
చుకుంట- నదులువనములన్నియుదాటుకుంట॥ఓ శా॥౯

అట్టె॥ నపుడుభూమంతగగ్గోలుబుట్టె- ఘోరమనిపె
ద్దకట్టంబుపుట్టె బెద్దకొండవలెవచ్చెతానట్టె-వచ్చుతాట
కినిచూచివాడట్టె-రామచంద్రునికికోపంబుబుట్టె-ఘుట్టి
స్త్రీహత్యయనిశంకబెట్టె-మౌనిరామచంద్రులతోడనట్టె
కొట్టుకొట్టువోయింకనేమంటె-చెప్పగానేరాముడువిల్లు
బట్టె నొకఱ్ఱకోలతోదానిబడగొట్టె- పెద్దకొండవలెనే
లబడెనట్టె-మౌనికపుడుసంతోషంబుబుట్టె- రామలక్ష్మ
ణులునతనితోటట్టె- వెళ్లుచున్నారుప్రీతితోటట్టె-విల్లంబు
లప్పుడుచాలబట్టె॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౦

వాసి॥ విశ్వామిత్రుతోడవిచ్చేసి-యపుడుమునివరుం
డుమఖదీక్షజేసి- యపుడురాక్షసులరాకుండచేసి- బాణ
జాలములచేతదెగవేసి- యతనిసంరక్షణంబుదాజేసి-వి
శ్వామిత్రుండలరంగజూచి- రామలక్ష్మణులబహుప్రీతిం
జేసి-సెలవుపుచ్చుకొనియచ్చోటదాసిమిథిలాపురంబున
కువిచ్చేసి-మిథిలేశుండువీరులనజూచి- పూజచేసిబహు

స్తోత్రములు జేసి- లక్ష్మణుఁడు రామునకు నాజ్ఞ సేసి-ఆ వెఱ్ఱి
మిథిలాపతినిన పుడు చూచి॥ఓ శారదా కరుణానిధీ॥

అంచీ॥జనకుడటు స్వయంవరము చాటించీ- నారను చు
మేమిట కేగుదెంచి - నాము వే వేగవిల్లు దెప్పించి-చూచెద
మంచుననగ మోదించి - వెయ్యిమందిపటు బాహువులబం
చి-వారుపట్టుకొని వేగజను దెంచి- తెచ్చిరొండ లెల్ల ముత్స
మటమించి-రామచంద్రుడెదుటికి నేగుదెంచి -రామచం
ద్రుండుయట్టె వీక్షించి-భూనివృద్ధాంగుళము చేతమించి -
యొగసికొమ్ము చేత నొగిలంఘించి - ఘట్టిగా పట్టి నారిమో
కించి-తీయగాపోయెతునకలైమించి -జనులు సంతోషప
డిరివీక్షించి॥ఓ శారదా కరుణానిధీ॥ ౧౨

అట్టి॥పెండ్లి చేసుటకు మదియపుడె బుట్టి శ్రీ తజనకుండు
ప్రీతిచే బట్టి- అపుడు దశరధునకును కబురు నెట్టి- వారలతి వే
గమునవచ్చినట్టి-రామచంద్రునకు ప్రీతిలెగ బుట్టి- శృంగా
రింపు జానకిని బట్టి- చేబట్టి తాపుత్రై మెడఁగట్టి దేవతులకపు
డు సంభ్రమము బుట్టి-పుష్పవర్షంబులు గురిపించిరట్టి- స
మయమున మగుడ మైనంబుఁ బుట్టి లేలెమ్మనగనడుపుత్వర
ట్టి- వారలను వారలంపకము బెట్టి- వెడలిపోగా నెనొకవిం
త బుట్టి- పరశురాముండు పమగెత్తైదొట్టి-దశరథునకపుడు
కంపంబు బుట్టి-అడలిజాగివాడ తెభీతి బుట్టి॥ఓ శా॥

నేను॥ భీకరంబైన రాముడను నేను- నామీదనొకరా
ముందు తాను-నామంబు గలవాఁడవై తేమ- యుద్ధమునకు
రమ్మని బిల్వగాను - నా కెరుక లేకుండఁగాదాను - చివు
కు విల్లొకటి విరిచితిని నేను-సీతనప్పుడె పెండ్లాడినాను-నా

యంతరాజీభూమిలోను- లేఁడుగదయనుచుగర్వంబుతో
నునిన్నుఁబోనివ్వరోరియింకాను- పరశురాముండు మదికా
కతోను తుకుఁ విల్లొకటనీచేతిలోను- ఉన్నవిల్లిపుడునీవె
కుఁబూను- చేతనైనమొగవాఁడవైతేను పరశురాముఁడి
ట్టులబలుఁగాను॥ఓ॥ ౧౪

అనెను॥ రామచంద్రుండువిల్లుదెమ్మననెను-సూత్రం
బుగాబుద్ధిసెప్పెనను-తనయింశయటుతాదీసుకొనెను-గ
ర్వహీనుఁడైవాఁడూరుకొనెను-వింటబాణముపుడుఁదొడిగి
నాను-యేటువేతునోయనియడిగినాను- దుష్టరాక్షసులఁ
దుంచేయుమనెను నట్లుసాయకమువిడిచివేయగను- పర
శురాముండుతాఁహీమామనెను- కాచిరక్షించుమనియూ
రుకొనెను విల్లునెత్తిపైతాఁబెట్టుకొనెను-పట్టుకోలేకవా
డట్టైజనెను-దశరథునిగుండెగూటయటబడెను॥ ఓ శార
దాకరుణానిధీ॥ ౧౫

మెచ్చి॥వాయువేగమునవారపుమవచ్చి-సాకేతపట్టణ
ములోజొచ్చి- వెళ్ళుచుండస్త్రీలందరువచ్చి- పళ్ళెములతో
డనవ్వాళులిచ్చి-వారికందరికికట్నంబులిచ్చి-మంచిజల్తా
రుచీరెలపుడిచ్చి- మేలుపతాసరవికెలుచాలనిచ్చి-చిత్రమై
నట్టిభూషణములిచ్చి-యాటపాటంబులకువేగవచ్చి-యు
న్నంతలోదశరథుఁడుమెచ్చి-రామచంద్రునిపైదయవచ్చి
ఓ శారదాకరుణానిధీ॥ ౧౬



# అయోధ్యాకాండము-

పరువు అటతాళము-

తాను ॥ అపుడుదశరథుడుతనమనసులోను - మిమ్మ
పట్టాభిషిక్తుగాఁగాను - జేయుటకును సంతోషంబుతోను-
పట్టణంబుశృంగారించఁగాను - పచ్చతోరణంబులుగట్ట
గాను- ముత్యాలముగ్గులుజల్లగాను- భేరినాదములువా
యించగాను- అయినకైకకుమోదంబుతోను- మతిౕంచె
నుకైక చెవిలోను- సకలసంభ్రమముతోనుండగాను- వెడ
లి వేగంబెమందరయుతాను - తనముల్లెఖమైననట్లుగాను-
ననఁగకైకయుల్లాసంబుతోను- తనవరంబపుడుయాచించ
గాను భంగపరచుటకునూహించగాను ।ఓ శారదాక ॥
పాన్ము ॥ నామాటవినుమ యీపాన్ము- పరముయిపు
డునీవడగంగవద్దు నాతో నీకుకక్షియు నేలవద్దు యిప్పుడూ
రకుంటెచాలముద్దు- నల్లురిలోననన్నిట్లువద్దు - కంకస్త్రీ
లపనిమాటహద్దు - దాటకుండినను నిహపరము కద్దు ॥
ఓ శారదాకరుణానిధీ॥ ౧౦

అయో॥ దినదినిహాపరము లేకుండబాయె- నాకుయాచిం
చుటకుసమయమాయె మనసెప్పుడూగయ్యాళియాయె-
నపుడుదశరథుఁడు తెలతెల్లపోయె - నపుడుదశరథుఁడు
మూర్ఛాధ్యుడాయె- రామచంద్రునకుకబురాయె- వచ్చి
తండ్రినప్పుడుజూచుటాయె జూచినంతలో నాశ్చర్యమా
యె- చింతనొందకనుదాబైనమాయె ॥ ఓ శారదాకరు॥

హెచ్చి॥ దశరథునిపైనకోపంబు హెచ్చి-లక్ష్మణుండ
పుడుబలెఁ-వాఁడ్రిచ్చి-రాజాధిరాజులనెల్లదెచ్చి-గొప్ప
దాండ్రిలోసటుబైలుబుచ్చి - పట్టణముగట్టుతాననుచు
హెచ్చి రామచంద్రులసటుమోసబుచ్చి -ఇపుడునీభా
ర్యవేగంబెవచ్చి- అడిగితేదానిమాటలకు మెచ్చి-మునుపు
యొప్పులోనీవువరమిచ్చి- ఇపుడుభరతునికిపట్నంబుయి
చ్చి- వేయుదాననుచుదాసిస్సుజొచ్చి ॥ ఓ శారదాకరు॥
వాసి॥ రామచంద్రుండుకన్నగపమూసి- యంతమా
టోయనిచాలుమూసి- ప్రత్యవాయదిత్తమువాడిజేసినా
పుయపరాధమీలాగుజేసి- తండ్రికప్పుడేవందనముజేసి
తల్లినాడయ్యతండ్రినెపబాసి-లక్ష్మణుండపుడు వెంటరా
జూచి-నీవుపుండవోయని బోధజేసి -ఉండలేనయ్యనిమ్న
మొడబాసి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౨౧

అంగ॥ రామలక్ష్మణులునపుడు వేగంగ - తల్లులున్నచో
టికినరుగంగ-నపుడువారలకు వేగమ్రొక్కంగ- మేము
నడపులకుయిపుడు వేగంగ వెళ్లుతామనుచునపుడు జెప్పం
గ-వారుయీమాటలాలకించంగ-అప్పటప్పటికిదుఃఖము
ప్పొంగ-రామచంద్రవిభుబోధసేయంగ - నెంతగనకిప
దునాల్గేండ్లనంగ-పదునాల్గుదినములరూపసంగ- గడిపివ
చ్చెదముమరలివేగంగ నపుడులక్ష్మణుడుతన్నుగొలువంగ
జనకజనుగూడివేగనడువంగ - పట్నమెల్లపుడుదిన్నబో
వంగ-అడవికేగెనుమదినిపొంగ॥ ఓ శారదాకరుణా।

## అరణ్యకాండము-

---

### దరువు-అటతాళము-

ధీరం॥ శ్రీరాములకుసువనసంచారం- పట్టణంబులో
పలవారిఘోరం- బైనయటువంటిచాలవిచారం- జేయు
చున్నారుయిట్లుపరిహారం - కోటిమన్మధులసుందరాకా
రం-బైనయట్టిశ్రీరాఘవులుకూరం- బేగుచునుగాంచిర
టశృంగిబేరం- గుహుడుసంతోషమైనసెవిస్తారం-పావ
నంబాయెనన్నృతాబ్ధిసారం-మీస్మరణజిహ్వకునలంకారం
నేడుగమకొంటినీమహాంకారం- కన్నులకుపండుగాయె
శృంగారం-నామనసిపుడుసంతోషపూరం-నీరాకగోరు
చున్నవారం- నేటికిట్లాయెబ్రాహ్మణపారం బుండెన
య్యేనాసంసారభారం-బెంచిచూచితెవట్టినిస్సారం॥ ఓ
శారదాకరుణానిధీ॥ ౧౩

మేటి॥ కోరిశ్రీరామవిభునాజ్ఞతోటి- గుహుడుగాన
వచ్చెనునావతోటి- దానిపైనెక్కి-నదియపుడుదాటి-ము
గ్గురడవికేగిరిముదముతోటి- మ్రొక్కి-సెలవడిగిమోదం
బుతోటి గుహుడుసెలవందెమునుపున్నచోటి -సీతలక్ష్మ
ణురామయ్యాతోటి - భరద్వాజమునియాశ్రమముదాటి
చిత్రకూటంబునరిగెనామేటి- పైకేగిరుల్లాసంబుతోటి-
నపుడుభరతుండుదుఃఖంబుతోటి॥ ఓ శారదాకరుణానిధీ

అంచె॥ దశరథుండపుడుదివికేగుడెంచె అపుడుభర
తుండుచాలదుఃఖించె - వీరలున్నచోటికియేగుదెంచె॥

మోదమలరంగమిమ్మువీక్షించె- హస్తయుగ్మంబులపుడు బోధించె- మునివివిను మనుచుయపుడువినిపించె మించిన ప్రతిపను లేమిమించె నికనైన నామనవులాలించె- పట్నమునకురమ్మనుచుబోధించె-రామచంద్రవిభుజాలస్తోత్రించె రాకవెళ్లు తామనుచుక్షీక్షించె॥ఓ శారదాకరు॥

రామా॥ చూడమీ వాద మే మేను కామా-సుగుణధామ యోసీతాభిరామా- ఇక్ష్వాకువంశాంబోధిస్తోమా పరులమానీకుత మ్ములముకామా - అపరాధములనొగిజేసనా మా-మునివియాలించుకరుణాలలామా-మరచినావయ్యా మామీపైప్రేమ వోర్చిత్తమజేయుసద్గుణసోమా - పట్నమునకేగుదామయ్యారామా-యనగభరతుండుబలెకెనిటు ప్రేమ వీరబలభీమహేమాద్రిధామా॥ఓ శారదాకరు॥

పూనె॥మీతల్లికొరెకలుచల్లగానే - పమనాలుగేండ్లాటగాగానె పమనాళ్లుదినములురీతిగానే -గడిపివచ్చితానినిబలకగానే - అయినబామమకులుదయచేయుమానె పూజదే సెదనటనిబలకగానె- రామచంద్రుడప్పుడుయివ్వగానె ప్రమొక్కిసెలవడిగితనువేడకతోనె నందిగ్రామంబులోనుండగానె- మిమ్మునుతగనుజరియించగానె-శరంభంగునివీక్షించగానె ॥ఓ శారదా॥ ౨౬

అనెను'అగస్త్యుని భ్రాతనటగనెను- మానియున్న చోటికేగజనెను- మోదమలరంగిబెంపుదాగనెను-మానిచాలగామెచ్చియిచ్చినను- శరచాపముల్ తానందుకొనెను -పర్ణశాలలోపల మోదమునను - సుఖముమీరంగ మున్నరుండినను॥ఓ శారదాకరుణానిధీ॥ ౨౭

నాతి॥ వచ్చినాఁడయ్యబలుసుప్పనాతి- ఉండెనయ్య
పెనభూతంబురీతి- పెద్దపులిరీతియెదురుకొనిమాతి- దు
ర్ణయంబైనరక్కసపుజాతి- కామార్థిచేయాచించురీతి॥
తి-గోళ్లున్నవిరళూలాలరీతి- కామార్థిచేయాచించురీతి॥
ఓ శారదాకరుణానిధీ॥ ౨౯

వాసి॥ రామచంద్రమనప్పడుకూకలేసి- ఓయివినవో
యనిన్నునేజూచి- నాకుమనసాయెననియతనిడాసి - కా
మార్థిచేయాచించురీతి - చుప్పనాతినీదుర్బుద్ధిజూచి-
మారుకేళ్లిలోసిమువెదజేసి - యపుడురామచంద్రుండు
హాత్యజేసి-దానినడ్డిపైవ్రాలొకటివ్రాసి లక్ష్మణునిగూడ
పంపివేసి నట్టివతేమాసము తానుజూచి - ధాటిగను
బట్టికత్తివారదీసి- దానిముక్కుచెవులునుకోసివేసి-వికృ
తరూపంబుదానపుడుజేసి- తాతతోజెప్పుమనిపంపివేసి-
చూచిరాక్షసులుహంకృతులుజేసి॥యా శారదాకరుణా॥

అందు ॥ మేలుగాజనస్థానంబునందు-రాక్షసులబట్టి
యుద్ధంబునందు- రామచంద్రుండుమటికాకజెందు-ను
గ్గునుగ్గుగామటిజేసెచిందు - జేసిబరిమాఱవచ్చిసుఖ
మందు-కొనుచుయున్నారుపర్ణశాలయందు-చావగామి
గిలియొకడుభయమందు కొనుచునేతెంచియెపుడులంకం
డు-రావణుఁడువినగనాక్రోశమందు-చున్నాఁడయ్యయా
సమయమందు అయినవేమాయెబగదీర్చుకొంప ॥ఓ॥

అట్టి ॥ మారీచునకుగబురుపుబెట్టి-వారలతివేగము
చవచ్చినట్టి - వచ్చివాఁడుముందరనిల్చినట్టి - కత్తివరవేగ
తీయుచున్నట్టి- యపుడుమారీచునకుబుద్ధిపుట్టి - వీడిచేత

నేటికినిపుడుగిట్టె- పోవనేలయనిపుణ్యుడయినట్టి- రామ
చంద్రుండుపుణ్యుడైనట్టి యతనిబాణములచేజచ్చినట్టి
పుణ్యమానబోదుయసితలపుబెట్టె -నెలవుపుచ్చుకొనితా
నేగినట్టి - రావణునికపుడుసంభ్రమముబుట్టె ॥యా॥ ౩౨

ఆడీ॥ సీతారామలక్ష్మణులపుడుగూడి- వారుకొంత
సేపట్టెమాట్లాడి-యున్నంతమారీచుండు లేడి-మాయచే
నాయెబంగారు లేడి-పర్ణశాలడగ్గరెవగలగూడి- జూచి
తమ్మువేగమె వేడి-దానిదెబ్బనుచుగక్రీ-నాలాడి మీరుదా
నినిప్పుడు వేటలాడి విల్లుచేబూనిసరి వేటలాడి॥ యా శార
దాకరుణానిధీ॥ ౩౩

సేత॥ రామచంద్రుండుకోపంబుచేత- గట్టిగాబట్టె
విల్లపుడుచేత- బట్టివేసెనొకబాణంబుచేత-హాలక్ష్మణా
యనిబొబ్బచేత- బర్ణశాలలోనున్నట్టిసీత-గుండెలదరి
బెగిలిభయముచేత-అపుడులక్ష్మణునిపైనంబుచేత॥ ఓ
శారదాకరుణానిధీ॥ ౩౪

అంత ॥ ఓయిలక్ష్మణాయిదియేమివింత- యనుచుసీ
తమ్మమదిలోనుచింత - నొందుచునువిచారించునా నెంత-
ఈమృగమురా నేలనాచెంత- దానిదెబ్బనగ నేలయిటు
వంతా-విచారించుచూ నెబొగిలెనంత॥ యా శారదా ౩౫

అంచె॥మీయన్నకేమోసంభవించె- నీవువెళ్లవోయ
నివిన్నవించె - నీవకతలయనిమఱివిన్నవించె- నయినానే
మాయెపొమ్మనిదలంచె-లక్ష్మణుడువిల్లుచేతసంధించి నా
ణబెట్టియటుతామజనుదెంచె - రామచంద్రవిభుదాన
ఘుడుగాంచె॥యా శారదాకరుణానిధీ॥ ౩౬

వాఁడు॥ రావణాసురుఁడుబలుమండగీడు - మాయ లేడినితాఁబన్నినాఁడు- తానుసన్యాసిరూపమైనాఁడు-పర్ణ శాలదగ్గిరజేరినాడు-వచ్చిభిక్షమన్నడుయెత్తినాడు- సీత యువతలికిరాఁగానెవాఁడు వికృతరూపంబుజూపించినా డు మూర్ఛబోఁగాసేదఁదాయుచునువాఁడు-చేతులనుపెళ్ల నెత్తుకున్నాఁడు- తేరుపైపదిలముగనుంచినాఁడు- మేఘమా ర్గమునదలుఁచున్నాఁడు - అపుడుదుశ్శకునములుజూచి నాఁడు-లక్ష్యపెట్టకచ్చటిగేగినాఁడు - ఫలముదొరికెరా యనిదలఁచినాడు మిగులసంతోషమునుబొందినాఁడు-యి ప్లులంకకైనేగుచున్నాఁడు॥యాశారదాకరుణానిధీ॥ ౩౭

అది॥జనకతనయదిగ్గునలేచినాది-వానివికృతరూపము జూచినాది- గుండెఝల్లుమనిబెదరినాది- దిక్కులేదను చునెలుగెత్తినాది- లక్ష్మణాకావుకావుమన్నాది- గోలు గోలుమనియేడ్చుచున్నాది కంటినీరపుడు వరదలైనాది యంతలోధైర్యమునుబొందినాది- క్రోధమునరావణుని జూచినాది-యోరియికనీకుపుత్రమిత్రాది సంపదలుయిపు డెబోవుచున్నాది-యనుచుబెదరకనుశపియించినాది॥ఓ శారదాకరుణానిధీ॥ ౩౮

అట్టి ॥ సీతపలుకులాలింపుచున్నట్టి-గృధ్రరాజునకుద యజాలబుట్టి-రక్కసునిపైనికోపంబుబుట్టి- వేగమునదా నువచ్చియున్నట్టి-పక్షపాతములవానినుడిబెట్టి పోకుపోక నుచుతాఁబొబ్బపెట్టి-రావణాప్రాణముల్విడిచిపెట్టి- పో వగలవనుచుదాజుట్టుముట్టి - వానిరథమప్పుడేనుంటగొట్టి-

రక్కసునిఁకొమ్ముకాళ్లుదెగమొట్టి- మెడలువ్రాడిపడనెత్తి
పైఁగొట్టి యుండువానికినితలదిమ్ముఁబట్టి - ఝుమ్మ్మనిసొ
మ్మసిల్లుచున్నట్టి- రావణునికపుడురోషంబుబుట్టి-చంద్ర
హాసంబుపలచేతఁబట్టి - వారిరెక్కలనుముక్కలుగఁగొ
ట్టి-వానినేలబడద్రోచి వేబట్టి భూపుత్రికనుతా చేతబట్టి -
పోవగా సీతకునుదిగులుఁబుట్టి - ఏడ్చుచునుతనదు వెంటను
న్నట్టి భూషణములెల్లనటుదీసిబెట్టి - పైటచెంగుచేనొక
మూటగట్టి-ఋష్యమూకంబుపైవిడిచిపెట్టి శోకవార్ధిఁ
లోమునుగుచున్నట్టి లోకమాతపైగడువేడుకఁబుట్టి- రా
వణాసురుఁడులంకనున్నట్టి కేళికాశోకవనమునను బెట్టి- భీ
తిఁబుట్టించువారలయినట్టి-రాక్షసస్త్రీలకావలిలోబెట్టి ॥
ఓ శారదాకరుణానిధీ॥ ౩౯

అ.రి॥ రామలక్ష్మణులునటుగూడిగొనిరి పర్ణశాల
దగ్గరజేరుకొనిరి - సీతలేదాయెయనియనుకొనిరి ఎంత
యాశ్చర్యమునిభ్రమసికొనిరి అడవులందువెదకుచువేగ
జనిరి- విల్లంబులప్పుడుబట్టుకొనిరి - దీనవదనులయితల
వంచుకొనిరి॥ఓ శారదాకరుణానిధీ॥ ౪౦

అం శై॥రామలక్ష్మణులమదిచంచలించె - దైవమీరీతి
గావిచారించె-పూర్వకృతమైనపాపంబుమించె - నేటికీ
దుఃఖమిపుడుప్రాప్తించె-నంతకంతకునుమదివిచారించె॥
యా శారదాకరుణానిధీ॥ ౪౧

మీరి॥ వారిజాక్షిరాసుందరాకారి - పొగడతరము
గాదురమనోహారి-దానిసమమైనస్త్రీలుభువినేరి -మంచి

మేలయినయట్టిశృంగారి పొందనీయకుండునుమరునిచారి
పల్కదాయబోపొదరిండ్లదూరి - యాసన్నదోషైనకోపం
బుమీరి నేనుయెప్పుడుదానాజ్ఞమీరి- నేలుకొమ్మనుచుతా
నుమదిదూరి-యంతకంతకునుశోకంబుమీరి - యనుచువ
ణించెనీరీతిశౌరి॥ఓ శారదాకరుణానిధీ॥     ౪౨

తరవూ ॥ దానిసోయగంబెన్నంగతరమా - మంచి
వతరూపమైనసుందరమా- దానిపలుకులుకోకిలస్వరమా-
చూడసొగసైనకంబుకంధరమా - దానికుచగిరులుయతి
సుందరమా-దానికెమ్మోవియమృతసాగరమా-దానివలు
వరుసముత్యాలసరమా- దానిమేనెల్లమేల్మిబంగరమా -
తలంచుకుంటేనుమదినిల్వతరమా- బ్రహ్మరుద్రాదులకునె
న్నతరమా-ఇదేగదచూడశోకసాగరమా-రామచంద్రుం
డునపుడువేగిరమా - బోధసేయంగలక్ష్మణునితరమా॥
యోశారదాకరుణానిధీ॥     ౪౩

అంత॥ రామలక్ష్మణులువెదుకగానంత- నుండెభూత
లముపైనికొండంత-నుండగాజూచిశ్రీరాములంత ఓయి
లక్ష్మణాజూడుమీవింత- యనుకొనుచుమేగిరిదానిచెంత-
౩రినీవెవ్వర నియడిగిరంత నున్నవృత్తాంతముపలిచెనం
త- రాముడాశ్చర్యపడెయుండెనంత॥ యోశారదాకరు
ణానిధీ॥     ౪౪

చాల॥ ఓయివినవయ్యారామభూపాల - నాప్రజ్ఞతి
ప్పుడుజెప్పనేల- మించుకార్యంబునకుగుందనేల రావ
ణునితోడనెంబుపుడుచాల-ఓరిపాపాత్ముడాసీతనేల-తే

చ్చినావుగా నేనింక నేల- గల్పితానురాయని నేను చాల-
యుద్ధమొనరించెవాండుమమూాల- జేసికొట్టినాడిటుభూ
మిపూాల॥ ఓ శారదాకరుణానిధీ॥ ౪౫

నేను॥ మీదర్శనము జేయుడాకాను ఇట్లుప్రాణముల్ నిలిపి
యున్నాను- ఒకటికోరికనుగోరుచున్నారు - నాకుయి
ప్పించు వేగత్వరగాను- నీమనసుకొచ్చినకోరిక- నేను- నీకు
యిత్తుననుచునుబలుకంగాను - కాడులేనట్టిచోటత్వరగా
ను- దహనమొనరంగజేయుచున్నాను। ఆరీతిగాంగావిం
చితాను- పక్షికిపిమోక్షమపుడివ్వగాను- తమరుకొంత
దూరంబేగగాను॥ ఓ శారదాకరుణానిధీ॥ ౪౬



## కిష్కింధాకాండము-

### దరువు - అటతాళము.

వచ్చి॥ రామలక్ష్మణులు వేవేగవచ్చి - శబరిచేవిందు
గొనివచ్చి మెచ్చి - కలిసి భాషించి తెలిసి మన్నించి - సుగ్రీవు
నేలుటకు దయవచ్చి - యపుడు సూర్యపుత్రుండు తావచ్చి
సుగ్రీవుండు చాల మోదించి - యున్నంత సుగ్రీవునటు మె
చ్చి - కోరెలిత్తునంచని పంతగించి యున్న వృత్తాంతమువు
డుమెటిగించి - అన్నదమ్ములకు జగడంబు బెంచి - రాము చె
ట్టుచాటున వేగ పొంచి - గొట్టుదామనుచు మది విచారించి -
యున్నంత యనుమానంబు మించి - కొట్టలేక రామయ్య చా
లించి యున్నంత సుగ్రీవుడరుదెంచి - రాదు చంద్రిలమీద
కోపించి - చేతిలో చెయి వేసి నమ్మించి - వెళ్లుమనుచు నన్ని
ట్లు బంపించి - రాముండప్పుడే బల్లె మల్లించి - యిర్దరొక్క
రీతిగ నున్న నెంచి కొట్టకున్నాను నే విచారించి - రేవు నీకొక్క
యొరుక నూహించి - కొట్టు తాననగ చాల మోదించి - యుండె
రీరీతి సుఖములను మించి - యా మరునాడు యుద్ధమూహిం
చి॥ ఓ శారదా కరుణానిధీ॥ ౪౭

అట్టె॥ సుగ్రీవుండు యొక బొబ్బ బెట్టె - వాలికప్పుడె
కోపంబు బుట్టె - ఇద్దరికి పెద్ద యుద్ధంబు బుట్టె - రామచం
ద్రుండు కాచి కన్నిపెట్టె చెట్టు చాటున సువిల్లెకుఁ బట్టె - దె
బ్బతో వాలి నపుడు బడగొట్టె తారకప్పుడే దుఃఖంబు బుట్టె

దానివారింపసమ్మదము బెట్టె-సుగ్రీవునకుపట్నంబుగట్టె-
అంగదునియువరాజుచేపట్టె - తానుమాల్యవంతముకేగె
నట్టె-నాల్గునెలలువర్షాకాలమట్టె- వెళ్లగారామునికత
లపుబుట్టె - సూర్యపుత్రునకుభయమాత్మబుట్టెమీచిత్తం
బునకువచ్చినట్టె-నాయనగసంతోషంబుబుట్టె- లంకసా
ధించుటకుబుద్ధిపుట్టె-నపుడువానరులకుసుకబురుబెట్టె ॥
శ్రీశారదాకరుణా॥ ౪౭

అను॥అపుడుకపులెల్లవేగరాగాను- రామలక్ష్మణుల
కడకేగగాను- తెలివిలేనికింకరలుండగాను- లెక్కలేనివా
నరబలముతోను-వానరులవింతలెల్లాను-చూచిరాముడా
శ్చర్యంబుతోను-చెట్లపైనెక్కియాకులెల్లాను-దూసిపోసి
కిందకుదొర్లుచూను - నొండొండుతోబోరాడగాను-
నొకటికిచనుచుపారిబోగాను-గంతులేసివెక్కిరింపుచూ
ను-కోతిచేష్టలునిటుసేయగాను- వార్ధిచెంతకునేగిరంతా
ను॥శ్రీశారదాకరుణా॥ ౪౮

సుందరకాండము-

శ్రీశారదరామాయణము-

అనెను॥ రామచంద్రుండు ప్రేమతోననెను-హనూ
మంతుడప్పుడు గనుంగొనెను- లంకలోకి వేగమె వెళ్లుతా
ననెను ఉంగరబందుకొనెనట్టె జనెను - హుంకరించ్చట్టె
చెంగునను జనెను-వార్ధిదాటి తాలంక కేగినను వింతవిం
తలెల్లాశ్చర్యమునను- జూచిమాపు తాననుచునను కొనెను
ఓ శారదాకరుణానిధీ॥ ౫౦

అణగె॥ చిన్నకోతివలె తానట్టె మణగె-లంకలోకి మె
లమెల్లనె జూణగె- లంకిణీ జూచి మదిలోన సుణగె -శరణ
మొకట్టంటితో చెయ్యదొణగె- కోపమునట్టె హనుమం
తుగణగె దెబ్బతో దానిపొంక మణ్లణగె- లంకలోనపుడు
వెనుకంగదొణగె-చాలగా మదివిచారింపదొణగె॥ ఓ
శారదాకరుణానిధీ॥ ౫౧

మోది॥ బల్ లంకిణి పటపటను మోది-బలుపైనయా
మేడలెక్కేది- సొగసైనయిండ్లు జూచేది పురమెల్లతాగ
లయజూచేది జనకాత్మజయీవూరనేది ఇకనెక్కడనే
నువెదకేది-యనుకొనుచు దాజింతనొందేది॥ ఓ శారదా
కరుణానిధీ॥ ౫౨

ధీరు॥ హనుమంతుడు చాలవిచారు - ధైర్యుండెనా
రాములవారు - వేగజూచిరమ్మనిబంపినారు- కానరా

దామెసీతమ్మవారు-లంకలోవారుమనకుపగవారు-నేను
యడిగితెజెప్పరెవ్వారు యప్పుడుపక్షులన్నియుబలుకఁ
దీరు-హనూమంతుండుపీరాదిపీరు-భాషదెలిసుండెమఱి
యాజదారు - పక్షిమాటలకుమదిలోనగీరు- చున్నాఁడ
య్యకీర్తిఁ విస్తారు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౫౩

అంది ॥ హనూమంతుండు చాల మోదించి- అశోకవ
నమున కేగుదెంచి- సీతమ్మనప్పుడు తానుగాంచి- యంత
లోరావణుండేగుదెంచి-చూచి సూక్ష్మరూపంబుధరియిం
చి-కానరాఁడామెజెట్టుపైనుంచి-రాక్షసుండప్పుడు చాల
బోధించి- మాటలకుసీతతానుతలవంచి-యున్నంతవాఁడ
పుడుకోపించి లంకలోనపుడుమగుడనేతెంచి-హనుమం
తుడప్పుడువిచారించి-రామచంద్రునప్పుడుఁబ్రస్తుతించి-సీ
తమ్మయామాటలాలించి- సంతసించపుడుమదిచంచలిం
చి-రామయనుమాటవినుచుమోదించి వినుటలయిదారు
మాసములనుంచి యనుచునాల్గుదిక్కులనుపీక్షించి చెట్టు
పయినున్నహనుమంతుగాంచి- బట్టెసీతమ్మదివిచారించి
ఓ శారదాకరుణానిధీ॥ ౫౪

మేలు॥ రావణాసురునిమాయఁగాబోలుమనసునెంచి
తెమఱిదీనికీలు- ఈరాక్షసులకామరూపాలు-వీనివొళ్లె
ల్లతెల్లరోమాలు- వీనిరూపంబువానరముఁబోలుఅంతకం
తకును వింతచోద్యాలు - పుట్టుచున్నవిరామభూపాలుఁ-
డేలరాడామెరాక్షసులపాలు - నన్నుజేసియూరకుండె
గాబోలు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౫౫

కొమ్మ ॥ పైనుండగా జూచి సీతమ్మ ఘాతజేయను
నావేమొనమ్మ - నీపేరెవ్వరు జెప్పకొమ్మ - రావణు
నిమాయగా బోలునమ్మ కాను కాదమ్మ వినుము సీతమ్మ -
నేను రామచంద్రునిబంటునమ్మ నాపేరు హనుమంతు
డమ్మ - మాయలేదురా నీమాటనమ్మ ఒక్కతార్క్కణజె
ప్పుతానమ్మ రామచంద్రుల రూపంబునమ్మ - జెప్పుతాను
వినుమది సీతమ్మ ॥ యో శారదాకరుణానిధీ ॥ ౫౬

రాజు ॥ రామునకు సాటి భువిలేనలేడు చంద్రస
మమైన ముఖము గలవాడు - తమ్మిలను బోలు నేత్రముల
వాడు కెంపురీతి పైకెమ్మోవివాడు - శంఖమును బోలు
కంఠంబువాడు - యాజానుబాహుండైనవాడు సిహ్మ
మును బోలు నడుము గలవాడు - కోటిమన్మథుల సమమైన
వాడు - రామలక్ష్మణుల సమమైన జోడు - నీలమేఘ
కాంతుని బోలువాడు లక్ష్మణుడు హేమవర్ణంబువా
డు యౌను చు హనుమంతు జెప్పుచున్నాడు - యానవాల

ప్పుడందించినాడు ॥ ఓ శారదాకరుణానిధీ ॥ ౭౫
జూచి ॥ అపుడు సీతమ్మ నమ్మకముగ జూచి - హనుమం
తునటు బహుప్రీతిజేసి ఆయన నేనారామునిపుడు విశ్వసి-
రామచంద్రస్వపు వేగంబె జూచి - నాచందంబు విన్నపము
జేసి ॥ ఓ శారదాకరుణానిధీ ॥ ౫౮
ఓయి ॥ ఓయి హనుమంతయిక వెళ్లవోయి - రామల
క్ష్మణులతో జెప్పవోయి నాకష్టంబు వినిపించవోయి - బ
హుదినములే బాగాయెనోయి - ఇంక స్వామి దయరాదన్న

దోయి-నిదురభుక్తులు లేకున్నదోయి -రాక్షసులను శిక్షింపమనవోయి॥ఓ శారదాకరుణానిధీ॥ ౫౯

వారు॥ రామలక్ష్మణులుదయమీరినారు-వన్ను విడిచిపెట్టారకున్నారు- నామీఁదదయమరచియున్నారు-లేకపోతేనువారెంతవారు-గెల్వలేకపోయినవారు కారు యప్పటికినింక తెమలకున్నారు- రక్కసులపాలుననుజేసినారు॥ఓ శారదాకరుణానిధీ॥ ౬౦

అంచి॥ ఓయిహనుమంతనీవేగుదెంచి-నావృత్తాంతమంతయెరిగించి-వాయుపుత్రుండు చాలమోదించి- శాలసీతమ్మనపుడుస్తోత్రించి -హస్తయుగ్మంబులపుడు జోడించి-చాలనాకనుచుసువిన్నవించి- ఫలములెలవివ్వమనుచుయాచించి॥ఓ శారదాకరుణానిధీ॥ ౬౧

వినుమి॥ ఓయిహనుమంతమనవిచేకొనుమి- లంకలో సీతచెరయున్నదనుమీ పూర్వకృతమియీలాగున్నదను మీ-లక్ష్మణునిచాలదయయుంచుమనుమీ - నావదుర్దోషంబనుచుననుమి - నేననుభవించెదనట్టులనుమీ లంకపాధించవేగరమ్మనుమీ వార్ధిదాటిబల్వేగంబెజనుమి-నీవు వేగంబెరామపాడగనుమీ॥ ఓ శారదాకరుణా॥ ౬౨

అమ్మా॥సంతోషంబుతోను వినవమ్మా - శ్రీరాములముద్దులగున్నా-దాశరథి మేలుబంగారుబొమ్మా- కాకుత్థ్సునిపువ్వుచేకొమ్మా -దేవతాస్త్రీలబందెకేసువమ్మా - నీవుబందియున్నావులేవమ్మా నావీపెక్కి కూర్చుండవమ్మా - లంకతోనుజగమెల్లాను సుమ్మా-పట్టుకొనివార్ధిదాటెదనుసు

మ్మ వామదిదాచుకొన్నట్లుసమ్మ-రాము సేవింపగా వెసీత
మ్మ॥ఓ శారదాకరుణా॥ ౬౩

తాన॥నామనివిచెల్లించుత్వరగాను - నాపయాకలి
పుతు వేయగాను- యొక॥ ఫలములిమ్మనియడుగగాను-
నీసెలవయితెతెచ్చు కుంటాను-బండిగా దమ్మయిమ్మనుం
టేను- సెలవుయిప్పించు వెళ్లిపోతాను-ఆకలికినోర్వలేక
డిగినాను॥ఓ శారదాకరుణానిధీ॥ ౬౪

ఓను॥ అపుడుసీతమ్మబల్కె-నటుతాను - వడకబె
ట్టుకొని తాగకుండాను. తూటుబోడిచేయదలంచియిట్లా
ను-ఓపలేవోయిరాక్షసులతోను- అయితెసెలవియ్యవెళ్లి
పోతాను॥యా శారదాకరుణా॥ ౬౪

జూచి॥సీతమ్మకపుడుజాలివేసి- వెళ్లవోయినీవాపం
డుగోసి-తెచ్చుకొమ్మనంగభయమెల్లబాసి- యపుడుతో
[illegible]యొకగంతువేసి పట్టువనమంతధూళిగా జేసి రాక్ష
సులమీదనొకగంతువేసి-తోకతో జుట్టినేలబడవేసి-గుండె
లదరంగ పెడబొబ్బవేసి - పట్టువనమెల్లధూళిగా జేసి॥
యా శారదాకరుణా॥ ౬౬

అ॥ అపుడులంకంతగగ్గోలుబుట్టె- చాపగామిగిలి
యొకండుపరిగెట్టె రావణునితోండజెప్పినాడట్టె తరమం
గానియుపద్రవముబుట్టె - కోటిరాక్షసులనుడిబడగంగొ
ట్టె- లంకిణినిబట్టిదెబ్బతోగొట్టె - నంతరావణుండుతా
నుండబెట్టె॥ఓ శారదాకరుణా॥ ౬౭

హాతి॥ అండాండంబుననుబుట్టెజ్యోతియాశివునికై
ననుపార్వతి- యాబ్రహ్మకైననుసరస్వతి- యావిష్ణుకై

నను లక్ష్మీప్రీతి-ముక్కుఁగోతఁబడెరా చుప్పనాతి - మనతో
టకొచ్చెరయొకఁక్రోఁతి- యోరియబ్బబ్బయది చెడ్డకో
తి- అయిన నెంతగద్దర దానిమూతి- వారిలో వారలనుకొను
చురీతి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౧౮

అచ్చి॥ అక్షయుండపుడు పైనమైవచ్చి- లక్షయేనూ
రుబలముతో వచ్చి- వాయుజునిపైని యుద్ధంబుకొచ్చి- యె
వ్వండపుగోరి వనములోకొచ్చి- రాక్షసులనందరిని సరిపు
చ్చివేసుటేలరా యని చాలహెచ్చి- వాయుజునికపుడు
కోపంబువచ్చి- దాటు చేయుచు నుపరిగెత్తివచ్చి- తోకతో
జుట్టికొట్టిసరిపుచ్చి యక్షయుని పట్టి తెగటార్చిపుచ్చి- తో
రణస్తంభమునకపుడు వచ్చి॥ యశారదాకరుణా॥ ౧౯

వారు ॥ హతశేషులై యున్నట్టివారు - లంకలోపలి
కిపరుగెత్తినారు యక్షయుండు జచ్చెనని చెప్పినారు-రా
వణునికపుడు మొరిగించినారు-రావణుండపుడు చాలవిచా
రు -పైయున్నంతవీరాదివీరు - పైనటువంటి మేలైనశూ
రు-డింద్రజిత్తుండు యతగాని పేరు-రావణునితోటి బలేఁ
టితీరు॥ యశారదాకరుణా ౨౦

ఉండు॥ ఇంద్రజిత్తుఁడు పొవలెనాతండు - యనుచు
వెళ్లసైనేవానిబోండు-దీనుతాననుచు నింద్రజిత్తుండు-నా
కెంతగనుకను వానరుండు యితనిపలుకులకు మదిరావ
ణుండు- గెల్వఁగలఁడనుచు మదిలోననిండు- ఆయెనయ్యానం
తోషభరితుండు॥ ఓ శారదాకరుణా॥ ౨౧

చూఁడు ॥ పట్టితెచ్చెదను నా మహిమచూఁడు - వార
ళనుజూచి వార్వేటలాడు-చున్నవాడెంతపనికోతి నాఁడు

నాచేతిలోపలచిక్కినాడు-పట్టుపడ్డాడుపారిపోలేడు-య
నుచురావణునిసెలవడిగినాడు-రథముందోలుచు నచునుబ
లికినాండు-వచ్చివాయుజునిపైడాసినాండు- శస్త్రజాల
ములచేముంచినాడు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౭౬

జూ॥ హనుమంతుండుమదిమాహాజేసి ఇంద్రజిత్తున
టతావదిలివేసి- యున్నబలమంతబరిమార్చిజేసి-యూర
కున్నాడుయపుడోర్పుజేసి- ఇంద్రజిత్తుండుకండ్లెఱ్ఱజేసి
భూమియదలంగగుణరవముజేసి విల్లుచేబూని తెగనిండదీ
సి-దేవలోకంబువిసకరిగమ్రోసి- అంబులున్నట్టిపొదులు
తెగవేసి-బ్రహ్మాస్త్రప్రయోగంబుజేసి-వాయుజుడుంబా
ణజాలంబుజూచి- పట్టుపట్టాడుమదిమాహాజేసి-ఇంద్రజి
త్తుండువిల్లెగరవేసి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౭౭

యుండి । వాయుజుండుచిన్నకోతియైయుండి-ఇం
ద్రజిత్తుండులేపట్టుకొండిఇంకపైకెకర వేసికట్టండి-తెండి
వేవేగతీసుకొనిరండి- రావణునకుచోద్యంబుచూపండి -
విడిచిపెట్టివేసేరుచూడండి॥ యాశారదాకరుణానిధీ॥ ౭౮

దొరికె॥ యింద్రజిత్తుచేతికితానుదొరికె - నాలంక
లోవారలందరికె- చిన్నకోంతివలెదోచెనాసరికె-రావ
ణాసురునికండ్లముందరికె వాయుతేగానెపట్లుతాకొరికె॥
ఓ శారదాకరుణా॥ ౭౯

అంది॥ లంకలోపలికికోంతివచ్చింది- చూచుదామను
చువాశ్చర్యమొంది- చూచుటకుచిన్నపిల్లలాగుంది-యో
రివినరోరిపదికోట్లమంది- రాక్షసులపట్టిచంపివేసింది చే

రగానకొట్టె ముపుడూరకుంది ఇదేనటరయిందరినీచంపింది యను మమొట్టెకాయలు వేయజెందె-యపుడు హనుమంతు మనసులోగుంది పేదుఘడియలిప్పటికినవుతుంది - నీళ్లు తున్నారు వేగిరము జెంది- ఓర్పుయోర్చుండిదాదాపయిం ది-ఈ వేళమీపనిచితుకుతుంది॥ ఓ శారదాకరుణా॥ ౨౦
ఓరా॥ వార్ధి నేలాగు దాటినావోర - లంకలోకిట్లుభ యములేకారా- వచ్చివనమెల్ల జెరికితీవోరా యక్షయుని బట్టిజంపితీవోరా- మాటలాడితేనవ్వుతావోరా- పేరుజె ప్పరా నీవెవ్వడోరా- హుంకరించేవుదు మూర్ఖుడోరా యా శారదాకరుణా॥ ౨౧
ఆన॥ నాపేరు జెప్పకమానుతావా- రాముబంటుకింద నుబంటుగాన- రాముడేలుచున్నట్టికపిసేన-చూచి నావు నాపురాగర్వాన- నిన్నుజూడవలెననిమనసులోన- బుద్ధిపు ట్టివచ్చితిరవేగాన - వీరహనుమంతుపేరు నేగాన॥ యా శారదాకరుణా॥ ౨౨
రంతు ॥ రామయ్యతో నేలరావంతు - వేదవాక్యము లు నామాటలెంతు- గోళ్లతోబట్టినీబొడ్డుజింతు-ఘడియ లోపలనువార్ధి గట్టింతు- రామలక్ష్మణుల వేగదెప్పింతు- వారిచేతనుతలలుదుంపింతు- నామహిమెల్లకండ్లజూపిం తు-భయమువిడిచినీవిటురంతుగందు- యశ్నైపట్టినీమీపా లుదుంతు- నీలంకంతధూళిగావింతుసన్నుయెరుగవావీర హనుమంతు॥ ఓ శారదాకరుణానిధీ॥ ౨౩
నీవు॥ ఓరివినరోరివానరానీవు- యిట్లుభీకరంబులుబ ల్కుతావు-చూచితే చిన్నవలుసంతలేవు-జానకిని తెచ్చునా

వేళనీవు-యపుడెక్కడికిపారిపోయినావు - ఓరివినరో రావణానీవు-నీగుట్టుబైటనుబెట్టెదీవు- దొంగిలించియెత్తుకపోయినావు- ఎంచితేను మొగధీరుడవుగావు చేతగాని యధముండౌరనీవు - అపుడు నాకండ్లబడితేనునీవు నీలంకలోకిగడచిరావుఅప్పుడక్కడేశారుమంటావు॥ఓ శారదాకరుణానిధీ॥ ౮౪

అంచి॥ రావణాసురుండు చాలకోపించి-వాయుజునిమాటలెల్లనాలించి-దుమార్గుండువీనిబోడిపించి-వేసినటించుబంట్లబిలిపించి-ఈకై-పొంజులైదుమందేగుదెంచి యున్నంతవిభీషణుడుమించి - రావణాసురునికపుడుబోధించి-మాతలనునీవుయిట్లుచంపించి- వేసితేలోకులెల్లనిందించి-వేసెదరటంచుమరివక్కాణించి-వానరులకెల్లతోకముట్టించి-వేసితేచాలుననగమోదించి- రపుడురజకుడొక్కండుయేగుదెంచి-డగ్గరకుడాసియగ్గిచూపించి- వాయుపుత్రుండుకపటమూహించి పారిపోయట్లైమదిచంచలించి- రాక్షసులకువాశ్చర్యంబుమించి॥ యాశారదాకరుణానిధీ॥ ౮౫

అట్టి॥ ఆవాయుతనుసంభవునిబట్టి - యాయుక్కుస్తంభమునందుగట్టి వాలంబునాకోకలూజుట్టి - హెనుమంతుచాలగాబెట్టి-ఇలురక్కసులసందరినిబట్టి- తనకాలికిందబడమెట్టి- విడువగానాకాశంబుముట్టి- సరవితోడసీతకుజోతబెట్టి- యపుడులంకాదహనముగాబట్టి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౮౬

చెండె॥ అపుడులంకంతయొత్తుకొనిమండె - భూమి యాకాశముననుపొగనిండె-కార్చిచ్చులనుబోలినట్లుండె- అంతకంతకును ఘూర్ణిల్లుచుంచె నుండలము పొడవుజ్వా లలయియుండె- చిత్రగోపురంబులుగూలుచుండె సూర్య సోమవీథులుగాలుండె- పిడుగులనుబోలుశబ్దమాచుండె- బ్రద్దలౌచుండె రాక్షసులగుండె॥ ఓ శారదాకరుణా॥ ౮౭

అయె॥ నపుడుపరశురామప్రీతియాయె - రాక్షసుల కొంపలుదగ్ధమాయె- వాండ్లునిలుచుటకునీడలేదాయెరా వణాసురుండు తెలతెల్లపోయె - కొంటెబలమంతనాశనం బాయె-వాయుపుత్రునకుసంతోషమాయె-తోకచలుకచే యుటకుమనసాయె॥ ఓ శారదాకరుణా॥ ౮౮

అంచి ॥ అపుడువార్ధిదగ్గరకేగుదెంచి-భయముచే వారిధినిపారుదెంచి-యపుడుహనుమంతుజాలకోపించి - పెనికబెట్టుకొనియితడున్ననుంచి- వేగవాలంబుచలువగా వించి-సీతవద్దకుతానేగుదెంచి- హస్తయుగ్మముల్ నుదుట ముకుళించి- మ్రొక్కగాయపుడుసీతమోదించి- జయము బొందుమనిచాలదీవించి॥ ఓ శారదాకరుణా॥ ౮౯

అనెను ॥ సీతకునుమ్రొక్కి సెలవడిగిజనెను - వార్ధి హుంకరించ చ్చైచంగునను- దాటిసుగ్రీవుతోటతాగనెను- జూచిపండ్లెల్లగోసుకొనితినెను -తోటకాపున్నవాండచ్చైజ నెను- వానిచాలగాబాధపెట్టెనను- వాడుసుగ్రీవుదగ్గరకేజ నెను-ఎవ్వడోవనముతాజూరగొనె నుమీరులక్ష్యంబులేరు పొమ్మనెను- దిక్కుగలచోటజెప్పుకొమ్మనెను-అపుడుయీ రీతివాడుజెప్పినను॥ ఓ శారదాకరుణా॥ ౯౦

అంచి॥ సుగ్రీవుండు చాలకోపించి- చూడు నామహిమ యనిపంతగించి- యంతలో రామచంద్రుడూహించి- లంకలోజయము చాలగావించి- వచ్చితోటలోపలికి నేతెంచి- హనుమంతుండు యనివిచారించి - సుగ్రీవునపుడు డుల్లించి- యంతలో వాయుపుత్రుడరుదెంచి- రామునకు వందనంబాచరించి॥ సీతజూచినానని విన్నవించి - రామచంద్రుండు చాలమోదించి- హనుమంతునపుడు బ్రస్తుతించి- రామచంద్రుడప్పుడు కౌగలించి॥ యాశారదా కరుణా॥

కంటె॥ సీతమ్మను లంకలోకంటి- చూచి శరణమనుచు మోదంబునంటి- రామనీక్షేమవార్త లేనంటి- యంతన నునమ్మకున్నవాల్గంటి- కేను విశ్వరూపము జూపిమంటి- యవలనమ్మియారక్కసులనొంటి- నున్నదానగాయింక నీవంటి బంటుగల్లగా రాము నేగంటె- ననచుదల చెదను నాదు శిరమంటి- యున్నమానికము రామకిమ్మంటె- వనుచు నియ్యగా నేనుగైగొంటి- యిట్లుగొని తెచ్చితినిగొనుడు తొంటి - పుణ్యమున సీతవార్త నేగంటి॥ ఓ శారదా కరుణా॥ ౯౨

అట్టి॥ సుగ్రీవునకు హాసంబుబుట్టి- లంకలోపలను నీవు జేసినట్టి- వృత్తాంతంబు జెప్పుమన్నట్టి సమయమున వాయుజుడు వొంతిబెట్టి- వార్ధి తాను వేగమె దాటినట్టి లంకలో పలికిదా వెళ్లినట్టి- లంకిణిని బట్టి తెగటార్చినట్టి- సీతమ్మను తాజూచినట్టి- ఇంతలో రావణుండొచ్చినట్టి- మగుడి లంకలో కేతెంచినట్టి- సీతమ్మతో మాట్లాడినట్టి- యుంగరంబానవాలిచ్చినట్టి- తాను వనమంత చెరి కేసినట్టి- అక్షయుని బట్టి తెగటార్చినట్టి- ఇంద్రజిత్తు చేతను దొరికినట్టి - లంకదహ

నంబుగావించినట్టి-మగుడ వార్ధిన్ వేగమె దాటినట్టి వర్త
మానంబు జెప్పుచున్నట్టి సుగ్రీవునకు మది ప్రియము మట్టి -
హనుమంతు ఘనుగౌగిటను బట్టి॥ఓ శారదాకరుణా॥ ౯౩

వీలు॥ ఆలంకానగరంబేలు విశదంబుగ నన్నేగజాలు-
ఆపురికి నాల్గుద్వారాలు- దక్షిణంబున నగరి బోలు- బలులం
కిణియను జవరాలు ఏమందు దానిమమార్గాలు -ఇక్కడచె
దాని పేరిగూలు- అదిగడచిన మరిచోద్యాలు - స్వర్గంబు
న కాపురి మేలు-ప్రతియింటను హోమగుండాలు- యెడ
తెగరు వేదమంత్రాలు మది నెరుగంగరు ద్రావ్రనాలు-లే
దయ్యదయాసత్యాను॥ఓ శారదా॥ ౯౪

వాలు॥నన్నందు మేల్ దివాణాలు- మతివన్నెలత్తుగు
త్తాలు-వాటిపైనమరు వెండిపల్లాలు- సొగసైనయేనుంగు
మొత్తాలు-ముత్యాలసరులు వజ్రాలు- వజ్రాలు మెరుంగు
జల్లిలు-నడివీధులలోన గాడీలు - దీసైన రాజమార్గాలు
చాలనలువొందు నంతఃపురాలు - పగడాల మెరుంగు స్తం
భాలుసువర్ణ కాంతిమద్యాలు సొగసైననీలిఝుండాలు-
దేవతలకు బందిఖానాలు-కాపున్నాసురసంఘాలు-ముద
మందుచునా పురమేలు - రావణుని మేలుభోగట్టాలు-ఏ
మున్నదియగ్నికిపాలు నేపంచివ స్తిభూమిపాలు॥యాశా
రదాకరుణా॥ ౯౫

త్రిలు ॥ ఎట్లుచూచినఘనసౌధాలు- యాసౌధంబున
విభవాలు-వరిబోలవు దిగ్దేశాలు - యాబ్రాహ్మణు నక్ష
త్రాలు-కవురంపు మోముబత్తీలు - యాపైనిబిళ్ళమరు
మాల ఆ(స్త్రీ)లుకున్నచోద్యాలు - చతురతులమందవా

హాళ్లు-చంచలమించునట్టిదేహాలు- నఖకాంతులకారల
సేలు- పాదమ్ములుపద్మరాగాలు- జంఘలవిరళంబగుకా
హళాలు విరులకుపరునరుకులబోలు- యూరందముచీమ
లబోలు-మధ్యంబులెన్నగఘనాలు- పిడికిళ్లకునతిసూక్ష్మా
లు-పాలిండ్లెన్నపువ్వుగుత్తీలు-కంఠంబులునవురుశంఖా
లు అధరంబులుదబింబఫలాలు - రదనపఙ్క్తులరయగ
వజ్రాలు-చెక్కిళ్లొప్పుచంద్రకాంతాలు - శ్రుతులం
దముప్రావణాలు సంపెంగులమిగులనాసాలు-నేత్రం
బులుజాతహరిణాలు-వీక్షణములునీలోత్పలసరాలు-ఫా
లేందునినగుఫాలకూలాలు- జడతీరులరయసర్పాలు శిరము
లపైని మేల్ రాగిడీలు- ముత్యాలకుచ్చులుశశివ్రాలు-చా
కీలుబల్ బారుపట్టీలు - చేర్చుక్కలందువజ్రాలు-ఆనంద
మైనకమలాలు-వాటికొనలనున్నట్టిముత్యాలు - కంఠం
బులందువజ్రాలు- జతగుచెక్కుకీలుజుమికీలు జాజీలు
నొప్పుజిగిపీలు-సరిలేనిచంపకల్లీలు- భేషైనకర్ణపుష్పా
లు-కరకంకణమునసుపోచీలు- మణిఘంటలజాగిరాలు-ప
దివ్రేళ్లకుటుంగరాలు- నెన్నడుములవడ్డాణాలు-బిగి
మీరెడికటిసూత్రాలు- పాదములయందుపసిడికడియా
లు ఘలుఘల్లనుపామంజీలు- ఆకిందనందియలుబలుడా
లు-రాణించేటియాయందాలు-యాలంకాపురిలోనిస్త్రీ
లు కూర్చుండెడునట్టిపీఠాలు ఘనమైనట్టిపుష్యరాగాలు
కుర్చీలుతలుక్కునేజాలు మృదువైనరవికెపట్టీలు- పైఠాణ
మేలుచుట్టాలు-ముత్యాలకూర్పుకోటీలు వీణియలుమీటు
కూప్తాలు- గళరవములనేకకీరాలు-భావంబులుమృదుల

వణ్ణాలు - యరదంబులు ముత్తసరాలు - ప్రతియింట
హోమగుండాలు- మొడతెగరుబో వేదమంత్రాలు-న
డివీధులలో నగాడీలు-బలులంకిణీయనుజవరాలు-యాది
గడబినమటిచోద్యాలు- లేదయ్యదయాసత్యాలు॥ఓ శా
రదాకరుణానిధీ॥ ౯౬

అం చి॥ అపుడు శ్రీరామవిభుడు హర్షించి-యాంజనే
యు గౌగిటను గదియించి-వత్సనాథులమునిలిపితివిమించి-నీ
ఋపతికారమేజేయనెంచి- యేమిసేయువాడను కౌగలిం
చి-నాడననిరత్నమపుడు గ్రహియించి-సీతనపుడుచూచిన
యట్టులంచి-తంబుగాగన్నులద్దుకొనిమించి - యవలలం
కకేగుటకుతలపుంచి వార్ధితీరంబు దాయజమడెంచి-క
పులనందరినివం ప్రీతికాంచి॥ఓ శారదాకరుణానిధీ॥ ౯౭



## యుద్ధకాండము-

### దరువు-అటతాళము-

ఉండీ॥ రామచంద్రుండుతీరంబునుండి-వార్ధిబంధిం
చుతాములేవండి- మంచిబలులైనకొండవేతెండి-వాయు
పుత్రుణ్ణిప్రోత్సహింపుచుండి - నలునువేయుకొండలువేయియు
చుండి-యడమచేతితోనందుకొనుచుండి హనుమంతుని
కికోపంబునుండి రోషమునకొండలాగివేయుచుండి- నె
త్తిపై దొంతిబెట్టుకొనుచుండి యతనివొళ్ళకొండలేనిం
డి-హనుమంతుండిట్లాగొంచుచుండి -భూమియదరిజవజ
వలాడుచుండి అపుడురామచంద్రుండుజూచుచుండి ఓ
శారదాకరుణానిధీ॥ ౯౮

జూచి॥ రామచంద్రుండుముదిమూహాజేసి-ఎదురుగా
వెళ్లిహనుమంతుడాసియక్కెయెత్తుకొనిబహుప్రీతిజేసి అ
తనిగర్వపరిహారంబుజేసి నలుని శ్రీరామచంద్రుండుజూ
చి-బాగనందుకొన్నానిజెప్పివేసి- ఘడియలోవార్ధిబం
ధించివేసి॥ ఓ శారదాకరుణానిధీ॥ ౯౯

వారం॥ అంగదుండపుడుతారాయఖారం - వెళ్లినా
డయ్యాభళీచలంబూరం-జూచిరావణాసురునిహంకారం-
గద్దెపైనిగూర్చుండెబలుఘోరం-అయినబంటులున్నారు
విస్తారం-అపుడంగదుడురావణునీవారం - తోలువాలం
బువాలవిస్తారం-చుట్టబెట్టుకొనికూర్చుండివీరం - అపు
డురావణాసురునిహంకారం॥ ఓ శారదాకరుణానిధీ॥

అంచి । రావణాసురుఁడపుడువీక్షించి - ఎవ్వఁడవురనీ విటకేఁగుదెంచి - నావుచెవ్వరాపేరువివరించి బల్కెవిక రసనుతోకబంధించి - సప్తసాగరాబ్ధులలోనముంచి - నట్టి వాలిపుత్రుఁడనరుదెంచి - తంబుగనెవంగదుండనరుదెంచి తానురా రామచంద్రుండరుదెంచి - వాఁడురానిన్నుచాల బోధించి - నీవురామునకుఁజామరేఁగుదెంచి - జానకినిదె చ్చియిపుడొప్పగించి - లంకయేలరాసుఖములనుమించి యంతసంగదుండుతానుమల్లించి - పల్కెనట్లుగానపుడు బోధించి॥ఓ శారదా కరుణాసిధీ॥ ౧౦౧

మిమ్మి । వేదవాక్యంబు నామాటనుమ్మి - బుద్ధిచెప్పె దనుయిపుడువినుకొమ్మి - రామచంద్రునకుజానకినియిమ్మి శంకలేకుండలంకేలుకొమ్మి - యూరికెచచ్చిపోయెదవుసు మ్మి - వెఱ్ఱివైయిట్లుచెడిపోకు లెమ్మి - నీకులమంతపోతుంది సుమ్మి॥ఓ శారదాకరుణాసిధీ॥ ౧౦౨

తోటి । అడవిలోవలసు సంచరించేటి - కూళ్లుకూర కాయలనుదినేటి రాముఁడన్నట్టి పెద్దనరుఁడేటి - పాటిజే సెదవునాతోనుమీటి - శూరసాహసంబునకు నా పాటి - వాఁడౌనయంతైననాధాటి - అనగనంగదుఁడుకోపించిధా టి ఒక్కదెబ్బతో కిరీటంబుమీటి - చూచుచున్నారురక్క సులుకోటి - సాహసుండైనయంగదుఁడనేటి - యతనితోను శూరుండుసాటి - వచ్చినాఁడయ్యవారిధినిదాటి - రామ చంద్రులగాంచెనోమేటి॥యా శారదాకరుణా॥ ౧౦౩

డంబు॥ అంగదుండపుడు చాల మోదంబు- తోడవచ్చి
పుడు మేల్ కిరీటంబు దెచ్చి రామచంద్రుల పాదంబులం
ముపుంచపుడ వేగదండంబు-బెట్టినంతలో వానరబలంబు-
ఏమయ్యాయీ తని సాహసంబు అనుచు జేయుచున్నారు స్తో
త్రంబు · రామచంద్రుండు యపుడు మోదంబు-తోడ లే
రోయి వేగ పైనంబు-యాయెనయ్య వారిధి బంధనంబు-చే
తుమనుచు తలిఁరి వేగిరంబు - వార్ధి దాటిను వేలాచలం
బు-పైనగిదియున్న యట్టి సమయంబు-లంకలో వారధిలతి
విభ్రమంబు॥ యా శౌరదాకరుణాసిధీ॥ ౧౦౪

ఉంఛ॥ విభ్రాంతి చేతను రావణుండు- తనబంట్ల నెల్ల
నుబిలుచుచుండు - నాలోచనలు యిక సేయుచుంతు వీ
రుండమనతి కాయుండు-దర్పుండును సగ్నిరోముండు-య
తిరథుండును మహో కాయుండు ప్రీతి లేని యింద్రజిత్తుండు-
కూ్రిరుండును సర్పరోముండు- మేలైనట్టి వజ్రదంష్ట్రుండు
కుంభుండును మరి నికుంభుండు- శుంభుండును మేల్మి శుం
భుండు-ఇరుచుట్లను రావణుని దండు-ఒక్కొక్కండే రా
మునిచండు-చెండాడు దానని బల్కుచుండు-అనియనగా
వెసహింపకుండు- యపుడు రావణుని పిన్న తమ్ముండు-ఇ
ట్లనియెనన్న కాతండు॥ యా శౌరదాకరుణా॥ ౧౦౫

అన్న॥ పెద్దన్న తండ్రి యట్లున్న - వీరందరి మాటలు వి
న్నా- నోర్వంగానలవి గాదన్న- యలనాడు యిచటికో పి
న్న-కోంతొచ్చినపుడు యీవున్న -వాకంత చేతగాకున్న
ఊరకున్నవారు సుమ్మన్న- అదిగనుకను నాదివిన్న-నమ్ము

చిత్తగించవోయన్న-రాముండుభూమిజచేకొన్న - మన
కేలవైరమోయన్న॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౦౬

ఆను॥రామయ్యతోవాదంబుమాను - కినుకచేతనునీ
వుబోతేమ-ఇదియెవరుయెపరికనుభవముగాను- చెడిపో
వజెప్పినవాడగాను- ఈరీతిగాజేయుమన్నాను - రావ
ణాసురుడుకాకచేతాను-జేసెబలెర్ర-నిప్పులురాలగాను-
సభలోనివారలువినంగాను॥యూశారదాకరుణా॥౧౦౭

జేసి॥ రావణాసురుడుబహుకాకజేసి- గద్దెపైనుండి
వొకగంతువేసి జరజరామనికత్తియొరదీసి -నరకబోయ
తైతన్నిపడవేసి-యున్నసభయెల్లభ్రమజెందఁజూచి రా
వణాసురునిదుర్బుద్ధిజూచి - విభీషణాఖ్యుఁడుచాలరోసి-
తో చినటువంటిమాటలాఁడేసి- రావణునిపైనికంఠ్లెర్రి
జేసి॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౦౮

నేడు॥ ఓరీరామయ్యకోపించినాఁడు- నీకోసమవతా
రమైనాడు చేతకంకణంబొగిగట్టినాడు-నిన్నుతక్షణము
లోపలద్రుంచుతాఁడు-వచ్చిరామయ్యకోపించినాడు వ
చ్చినాడిదిగోయికచూడుజూడు-వారధిప్పుడెగట్టించినాఁ
డునిన్నుయమపురికిపంపించుతాఁడు॥ఓ శారదాకరుణా

ఇరవు॥సీతనిచ్చివేసుటనీకుతెరవు- నేనుజెప్పితినిమేలై
నతెరవు-రాముఁడనగానెత్రైలోక్యగురువు- రామునకు
నీకుచాలనంతరము-హరికినేనుగకునెంతయంతరవు కొం
డకుమెట్టకెంతయంతరవు- రామునకునీకునంతయంత
రవు-పులికిభాగమునకెంతయంతరవు రామునకునీకునెం
తయంతరవుకత్తికినిసూదికెంతయంతరవురామునకునీకు

నంతయంతరవు- తూమునకుసోలకెంతయంతరవు- రా
మునకునీకునంతయంతరవు హేమమునకినుముకెంతయం
తరవు-రామునకునీకునంతయంతరవు-గెలుచుటకునీకుచా
లదుస్తరవు॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౦౯

అంచి॥ రావణాసురుండుచాలకోపించి-వీనినిప్పుడెనా
డుసభనుంచి- తోలివెయ్యుమనఁగానతడుమించి- అచట
నుంచివేవేగజనుదెంచి-తనమంత్రులందరినిబిలుపించి- స
భలోవారలకువిన్నవించి- తల్లికంతవృత్తాంతమెఱిగించి-
హస్తయుగ్మముల్నుదుటముకుళించి-మ్రొక్కఁగాతల్లియత
నిదీవించి-ఖలునిరావణునివిడచిగమకించి- శ్రీరాముతఁడ
నుచువేగజనుదెంచి-వేగజనుజేరదూరంబెగాంచి- యత
నిరాకసుగ్రీవుండుగాంచి-రావణాసురునితమ్ముఁడరుదెం
చి-యనుచురామచంద్రులకువిన్నవించి - లక్ష్మణుండప్పు
డుచాలకోపించి-పట్టికొట్టుటకుతావిచారించి- యంతట
నుజాంబవంతుడూహించి-లక్ష్మణునివేగశాంతమొనరిం
చి॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౧౦

ఉండి॥ నామనవొకటి త్తగించండి-వానిపై మీరుదం
డెత్తకుండి-రావణునితోడకెనుకజేసుండి- మనలోపలను
తానుగలనుండి-బుద్ధిపుట్టినామాటనమ్మండి-యనఁగరా
మచంద్రుండప్పుడునుండి-తగ్గవాడిప్పుడువారుపెళ్లండి-వాం
డివేవేగతీసుకొనిరండి - అనఁగవారప్పుడుమెదురేగుచుం
డి॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౧౧

ఆహా॥ నీమకోర్కె-నేటికిసఫలమాయె- నీవ్రతమెల్ల స
ఫ్రవతంబాయె-వెళ్ళుమనిరాముసెలవునీకాయె- నేటికిసిఁ

ర్మ పరిపక్వమాయె-జూచిరామునకుసంతోషమాయె-వీ
రిలోపలదానొక్కఁడాయె-రావణునిగుట్టుబట్టబయలా
యె॥ఓశారదాకరుణానిధీ॥ ౧౧౨

వుండె॥ కొన్నిమాటలెల్ల ననడుగుచుండె-లంకలోము
చ్చటలుజెప్పుచుండె.ఇంటిగుట్టులంకకుబయిటనుండె- న
నుమాటనిజంబగుచునుండె- రావణాసురుడుభయముబ
డచుండె- నుత్తరపుగోపురముననిలుచుండె- పట్టుగొడు
గులారడిగప్పుచుండె-జూచినాఁడయ్యావిభీషణుండె- చూడ
రయ్యామాయన్నయాతండె - యనఁగనప్పుడె రామచం
ద్రుండె॥ఓశారదాకరుణానిధీ॥ ౧౧౩

వాసి ॥ రామచంద్రుండుమదినూహజేసి- మారుతా
స్త్రంబువేవేగదీసి-వ్రానియాకర్ణములదాకదీసి-సూటి
గానుప్రయోగంబుజేసి - ఛత్రములకుత్తుకలనుదెగవేసి-
బాణజాలంబుమళ్లిపోజూచి-రావణాసురుఁడువిభ్రాంతి
జూచి-నిలువలేకపోయెనుభయముజేసి-భూస్థలముపైకొ
కగంతువేసి॥ఓశారదాకరుణానిధీ॥ ౧౧౪

దంబు॥ రావణాసురునిపైనయుద్ధంబు-సేయుదామను
చుచాలవాదంబు- తోడనున్నారువానరబలంబు- రావ
ణాసురునిపైనికోపంబు-జేసినాఁడుయిట్టులదుండిగంబు
ద్రుంచితేగానియికనామనంబు- కాదనుచునూబల్కెఁపం
తసంబు-తలకుతగనిపనిజేసెనేరంబు- వీనిద్రుంచితేలేదు
పాపంబు- రామచంద్రులకులేతామసంబు - జనియించె
బోయాసమయంబు - లేలేరోయియేమిజాలంబు - గల

దన్నజల్ల నిమారుతంబు- వై చెనయ్యాదంధణదంధణంబు-
ఘుండెలదరరణభేరినాదంబు॥ ఓ శారదాకరుణానిధీ॥

వారు॥ సుగ్రీవుండుమొదలయినవారు-బలువీరసంప
న్నులగువారు- రామచంద్రుని యెదుటనునిలిచినారు-యుద్ధ
మునకపుడు సెలవడిగినారు - మూడు సెలవులపుడు డందు
కొన్నారు-హ స్తముల్ నుదుట జేర్చి మ్రొక్కేరు- మోదమ
లర శ్రీరాములవారు - జయముబొందుమనిదీవించినారు-
తూణములలో నేనడుములుగట్టినారు- విల్లంబులూగి బట్టుకొ
న్నారు-యుద్ధసన్నద్ధులైనారువారు ॥ ఓ శారదాకరు॥

అంత॥ మోదంబుతో శ్రీరాములంతట- జూచినాడయ్యాత
నబలముచెంత- నీవురావోయివీరహనుమంత-యూరకు
న్నావుయిదియేమొవింత- ఇప్పుడే నేలబయలుపడనేంత-
యనఁగగరుణతోడుతనునీయంత - బంట్లుండగా మా
కేమిచింత-రామచంద్రుండుమెచ్చినాడంత-మ్రొక్కి సెల
వడిగినాఁడు తానంత॥ఓ శారదాకరుణానిధీ॥ ౧౧౭

మేలు॥ నా చేతిలో పలనాయుధాలు-లేకయున్నావుయి
దియేమొవీలు-కంకణముగట్టికలిబండివాలు-పట్టుశస్త్రవ
జ్రములుసాలాలు-నీమనసుకొచ్చినయాయుధాలు- యెం
చుకోవోయిశూస్త్ర్యహస్తాలు-యుండరాదోయిబంట్రో
తువీలు-హనుమంతుండుబల్కెనొకమేలు- ఎందుకికవేలా
యుధాలు-కల్మషములేని మపాదాలు-నమ్ముకొనియుం
డితేచాలుచాలు-పెద్దకొండవలెనాకాయుధాలు-ఈవన
ములేనాజబాణాలు-భూమినాకొక్కరథముననుబోలు-

వాటికవిషాదపు లేవుశస్త్రాలు-హనుమ . తుసీరామభూ
పాలు-మెచ్చదగునోయినీసగుణాలు॥ శా॥ రదా॥౧౧౭॥

వారు॥ రామలక్ష్మణులుయిద్దరూవారు-యుద్ధసన్నద్ధు
లై వెళ్లినారు-వర్ణించెదనువినరయ్యమీరు - మల్లెపువ్వు
టంగిల్లొడిగినారు-భుజకీర్తులేధరియించినారు-సత్తుత్రి
ముల్ చారులనే గేరు-పేరులూయాణిముత్యాలతీరు- శిర
ముపైకిరీటములశృంగారు-మేరుశైలశృంగారములతీరు-
వీరకాహళులుబట్టెటివారు-గంధర్వకిన్నరులెల్లవారు-గీ
తముల్పాడుచునునాడుతారు-నాలచిత్రమైనట్టియాతీరు-
లంకలోవారుజూచుచున్నారు - జూచికోటలోకేతెంచి
నారు-రాక్షసేశ్వరునితోడజెప్పేరు - వచ్చిపడిరిశ్రీరా
ములవారు- మంచిదేయనుచునూహించినారు-మంచిహా
రుమంజిముత్యాలతేరు- రావణునియెదుటనునిల్చినారు॥
శారదాకరుణానిధీ॥ ౧౧౮

దాని॥ పైనగూర్చుండిసూతుడగువాని - తోలుమని
కాకమదినిండబూని-నాపైకియుద్ధముకొచ్చువాని- నురు
ముజేసెదననిలేనిపోని-ప్రజ్ఞలెల్లమిక్కిలిబల్కువాని-గ
ణితలెక్కలుకులెక్కింపరాని- మూలబలమంతదరిజేర్చు
కోని-వచ్చినాండయ్యమదిగినుకిబూని-శైవబలమొక్కటే
లేదుగాని-మూండులోకాలవారైనగాని- చాలరయ్య
యెంతైనగాని-మహాగుణాఢ్యైనట్టిజోయెగాని॥ శా
రదాకరుణానిధీ॥ ౧౨౦

